౧౮౭. జనవాక్యంతు కర్తవ్యమ్.
పదుగురిమాటను పాటింపవలయును.

౧౮౮. జలాంజలిన్యాయము.
పోయినదానికై నీళ్ళు వదలుట.

౧౮౯. జలాక్షర న్యాయము.
నీటిపై వ్రాలు (నిలుకడ లేనిది)

౧౯౦. జాతస్య మరణం ధ్రువమ్.
పుట్టినవాఁడు గిట్టక మానఁడు.

౧౯౧. జామాతా దశమో గ్రహః.
అల్లుఁడు పదవగ్రహము.

౧౯౨. జీర్ణ మంగే సుభాషితమ్.
సుభాషితము వినువారును, ఆచరించువారును లేమినిఁ గడుపున జీర్ణించెను.

౧౯౩. జ్ఞాతిశ్చే దనలేన కిమ్?
జ్ఞాతియున్నచో నిప్పేల? జ్ఞాతిగుల్లు అరఁటికల్లు పోదని యాంధ్రభాషీయము.

౧౯౪. జ్యేష్ఠత్వంతు నహి జ్యేష్ఠ్యే జ్యేష్ఠత్వం గుణ ఉచ్యతే.
జ్యేష్ఠత్వమనఁ బెద్దవాఁడగుటగాదు. గుణమునుబట్టి వచ్చిన పెద్దతనమే పెద్దతనము.

౧౯౫. జ్యేష్ఠో భ్రాతా పితృసమః.
పెద్దన్న తండ్రితో సమానుఁడు.

౧౯౬. తక్రకౌండిన్య న్యాయము.
"బ్రాహ్మణుల కందఱికినిఁ బెరుగువడ్డింపుము. కౌండిన్యునకు మాత్రము మజ్జిగ వడ్డింపుము" అన్నపుడు కౌండిన్యుఁడు బ్రాహ్మణుఁడైనను సామాన్యవిధి యిట ప్రవర్తిల్లదు. విశేషవిధిచే సామాన్యవిధికి బాధ గలిగినపు డీ న్యాయము వర్తిఁచును.

౧౯౭. తక్రాంతంతు భోజనమ్.
భోజనముచివర మజ్జిగను బోసికొనవలయును.

౧౯౮. తద్ధితమూఢో వైయాకరణః; తద్ధితరూఢో వైయాకరణః.
సామాన్యముగా వైయాకరణుఁడు సిద్ధాంతకౌముదిలోని తద్ధిత భాగమును జదువఁడు. కావున నందు మూఢుఁడై యుండును. తద్ధితరూఢుఁడే యనఁగాఁ తద్ధితభాగమును క్షుణ్ణముగాఁ జదివినవాఁడే వైయాకరణుఁడు.

౧౯౯. తప్తేన సంధాన ముపైతి తప్తః.

కరగిన పదార్థము కరిగినపదార్థముతోడనే కలియును. సమానవ్యసనతప్తుఁ డట్టి వానితోడనే కలియును.

౨౦౦. తవాప్యర్థం మమాప్యర్థమ్.

నీకును సగము నాకును సగము. ఇట్టిదే దొంగలును 'దొంగలును గలిసి యూళ్ళు పంచుకొన్నారు. అని యాంధ్రభాషీయము,

౨౦౧. తాతస్యకూపోఽయ మితి బ్రువాణాః క్షారంజలం కాపురుషాః పిబంతి.

మాతండ్రిగారు త్రవ్వించిన బావియని మూఢు లుప్పునీళ్లు ద్రావుదురు.

౨౦౨. తిలతండుల న్యాయము.

నువ్వులును బియ్యమును గలిపిన విధము,

౨౦౩. తిలాంజలి న్యాయము.

నువ్వులనీళ్ళు వదలు విధము.

౨౦౪. తృణచ్ఛన్నకూపన్యాయము.

గడ్డికప్పుకొనియున్న బావివిధము. గోముఖవ్యాఘ్రమువంటిది.

౨౦౫. తృణేన కార్యం భవతీశ్వరాణామ్.

సర్వసమర్థులకును గడ్డిపరకతోఁ బనిపడును.

౨౦౬. తృణై ర్విరచ్యతే రజ్జు ర్బధ్యంతే తేన దంతినః.

తృణములు త్రాడుగా నేర్పడి యేనుఁగును బంధించుచున్నవి. ఇట్టిదే "బలవంతమైన సర్పము చలిచీమలచేతఁ జిక్కి చావదె సుమతీ!"

౨౦౭. త్రిశంకుస్వర్గన్యాయము (స్పష్టము)

౨౦౮. దగ్ధబీజన్యాయము.

కాలిన లేక వేగిన విత్తనము మొలకెత్తని విధము.

౨౦౯. దండాపూపన్యాయము.

దండమున కపూపములు (చక్కిలములు మొ.) గ్రుచ్చఁబడియున్నవి. ఆ దండమును నెలుకలు గొఱికివేసిన ఘనఁగా నపూపములుఁకూడ భక్షితములయిన వని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. ఇట్టివిధము.

౨౧౦. దండో దశగుణో భవేత్ (స్పష్టము)

౨౧౧. దుర్జనా యత్ర వక్తార స్తత్ర మౌనం హి శోభనమ్.

కష్టులు వక్త లగుచోట్ల మౌనమే మంచిది.

౨౧౨. దశమాతా హారీతకీ.

కరకకాయ పదిమందితల్లులపెట్టు.

౨౧౩. దుఃఖమేవ సర్వం వివేకినః.

వివేకికి సమస్త ప్రపంచమును దుఃఖమయముగానే యుండును.

౨౧౪. దుర్బలస్య బలం రాజా.

దుర్బలునకు రాజే బలము.

౨౧౫. దుష్కరం కిం మహాత్మనామ్ ?

మహాత్ములకుఁ జేయరాని దేమున్నది?

౨౧౬. దూరస్థాః పర్వతా రమ్యాః స్వమీపస్థాస్తు బర్బరాః.

దూరపుకొండలు నునుపు. దగ్గఱకుఁ బోయిన నేగుడు దిగుడు.

౨౧౭. దృష్టం కిమపి లోకేఽస్మిన్ న నిర్దోషం న నిర్గుణమ్.

ఈ లోకమున దోషశూన్యమైనదియు, గుణశూన్యమైనదియును గానరాదు. ప్రతిదానియందును గుణదోషము లుండును.

౨౧౮. దేవరన్యాయము.

దేవరుఁ డనఁగా భర్తయొక్క అన్న. సంతతి నిర్వంశమగుచుండఁగా దేవరుఁడు మఱఁదలియందు సంతానముఁ గని వంశము నిలుపవచ్చును. పాండు ధృతరాష్ట్రులు దేవరన్యాయమున వ్యాసునివలన విచిత్రవీర్యుని భార్యలగు నంబికాంబాలికలయం దుదయించిరి. ఇట్టివిధము.

౨౧౯. దేహళీదత్తదీపన్యాయము.

గుమ్మమునఁ బెట్టిన దీపము గృహబాహ్యాభ్యంతరములకు నొక్క మాఱే వెలుఁ గిచ్చును. ఇట్టి విధము.

౨౨౦. దైవస్య చిత్రా గతిః.

దైవగతి చిత్రమైనది.

౨౨౧. దైవ మత్రాతిరిచ్యతే.

అన్నింటిని దైవ మతిశయించును.

౨౨౨. ద్రవిడప్రాణాయామన్యాయము (లేక) ద్రావిడప్రాణాయామన్యాయము.

ద్రావిడులు ప్రాణాయామము సేయునపుడు చేతితో ముక్కునకు సూటిగాఁ బట్టుకొనక తలచుట్టును ద్రిప్పి పట్టుకొందురు. చెప్పవలసినదానిని సరిగాఁ జెప్పక త్రిప్పి త్రిప్పి చెప్పుచున్నపుడు దీని నుపయోగింతురు.

౨౨౩. ధనక్షయే వర్ధతి జాఠరాగ్నిః.
ధనము పోఁగా నాఁకలి పెరుగును. "దరిద్రున కాఁకలి యెక్కువ" యని తెలుగు సామెత.

౨౨౪. ధనమూల మిదం జగత్.
జగత్తునకు ధనము ప్రధానము.

౨౨౫. ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః.
ఎవనియధర్మము వానిని నశింపఁజేయును. ఎవనిధర్మము వానినిఁ గాపాడును.

౨౨౬. ధర్మంచ చింతయే త్ప్రాజ్ఞః.
ప్రాజ్ఞుఁడు ధర్మాచరణమును గూర్చి చింతింపవలయును.

౨౨౭. ధర్మం చర (స్పష్టము)

౨౨౮. ధర్మస్య త్వరితా గతిః.
ధర్మగతి వేగముగలది. అనఁగా ధర్మాచరణమున నాలస్యము గూడదు.

౨౨౯. ధర్మేణ హీనాః పశుభి స్సమానాః.
ధర్మహీనులు పశుసదృశులు.

౨౩౦. ధర్మో జయతి (స్పష్టము)

౨౩౧. ధాతా యథాపూర్వ మకల్పయత్.
మహాప్రళయానంతరమున బ్రహ్మపూర్వయుగము లందువలెనే తత్తత్సర్వవస్తువులను దిరిగి సృష్టించుచుండును.

౨౩౨. ధైర్యం సర్వత్ర సాధకమ్.
ఎల్లెడల ధైర్యము కార్యసాధకము.

౨౩౩. ధైర్యే సాహసేచ లక్ష్మీః.
ధైర్యమునందును సాహసమునందును లక్ష్మి నివసించును.

౨౩౪. నకామవృత్తి ర్వాచనీయ మీక్షతే.
కాముకుఁడు లోకాపవాదమును గణింపఁడు.

౨౩౫. నకాషాయై ర్భవే ద్యతిః.
కాషాయవస్త్రధారణముచే సన్న్యాసి కాఁజాలఁడు, "తలలుబోడులైనఁ దలఁపులు బోడులా" అని యేతత్సజాతీయము.

౨౩౬. నఖలు బహిరుపాధీన్ ప్రీతయ స్సంశ్రియంతే.
ప్రేమ బాహ్యోపాధిని నాశ్రయింపదు.

౨౩౭. న గచ్ఛే ద్బ్రాహ్మణత్రియమ్.
ముప్పురు బ్రాహ్మణు లేక కాలమున నొక స్థలమునుండి బయలువెడలరాదు.

౨౩౯. న గాయత్ర్యాః పరం మంత్రం న మాతుః పరదేవతా.
గాయత్రీమంత్రముకన్న శ్రేష్ఠ మగు మంత్రములేదు. తల్లికన్న మించిన దేవత లేదు.

౨౪౦. నందో రాజా భవిష్యతి (స్పష్టము).

౨౪౧. నభూతో న భవిష్యతి (స్పష్టము).

౨౪౨. నమాతా శపతే పుత్రమ్.
తల్లి పుత్రునిఁ జావు మని శపింపదు.

౨౪౩. నముహ్యే దర్థకృచ్ఛ్రేషు; నచ ధర్మం పరిత్యజేత్.
ధనసంకటములందు దుఃఖపడఁగూడదు. ధర్మమును విడువఁగూడదు.

౨౪౪. న రత్నం మన్విష్యతి; మృగ్యతే హి తత్.
మానవులను రత్నము వెదుకదు. మానవులే దానిని వెదకుదురు.

౨౪౫. న వారిణా శుధ్యతి చాంతరాత్మా.
పైని స్నానమాడుటచే నంతరాత్మ శుద్ధము గాదు.

౨౪౬. న వైద్యః ప్రభు రాయుషః.
వైద్యుఁడు జీవితమునకుఁ బ్రభువుగాఁడు. అనఁగా బ్రదికింపఁజాలఁడు.

౨౪౭. న సాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి.
మనుష్యుఁడు సాహసింపక మేలును బొందఁడు.

౨౪౮. న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి.
స్త్రీ స్వాతంత్ర్యమున కర్హురాలుగాదు.

౨౪౯. నహి ప్రతిజ్ఞా మాత్రేణ అర్థసిద్ధిః.
గప్పాలవలనఁ గార్యము సిద్ధింపదు.

౨౫౦. నహి సర్వః సర్వం జానాతి.
అందఱికిని నన్నియును దెలియవు.

౨౫౧. న హీశ్వరవ్యాహృతయః కదాచిత్పుష్ణంతి లోకే విపరీతమర్థమ్.
ఈశ్వరవచనములు నిరర్థకములుగావు.

౨౫౨. నాదత్త ముపతిష్ఠతే.
పూర్వజన్మమునఁ బెట్టకున్న నీజన్మమున రాదు.
ఈ విషయమున నీ క్రింది శ్లోకమును గమనించునది.
"ద్వారం ద్వారమటన్ భిక్షు శ్శిక్ష త్యేవం నయాచతే
అదత్వా మాదృశో మా భూ ర్దత్వా త్వం త్వాదృశో భవ"

౨౫౩. నానృతాత్ పాతకం పరమ్.
అనృతముకన్నఁ బాతకము లేదు.

౨౫౪. నానృషిః కురుతే కావ్యమ్.
ఋషిగానివాఁడు కావ్యమును రచింపఁ జాలఁడు.

౨౫౫. నారదః కలహప్రియః (స్పష్టము).

౨౫౬. నారికేళఫలాంబున్యాయము.
"సిరి దా వచ్చిన వచ్చును సలలితముగ నారికేళసలిలముభంగిన్"

౨౫౭. నావిష్ణుః పృథివీపతిః
విష్ణువు గానివాఁడు రాజుగాఁడు; లేక రాజు నరరూపుఁడగు విష్ణువు.

౨౫౮. నిందతి కంచుకమేవ ప్రాయ శ్శుష్క స్తనీ నారీ.
స్తనములులేని స్త్రీ రవికెను నిందించును.

౨౫౯. నిరంకుశాః కవయః (స్పష్టము)

౨౬౦. నిరస్తపాదపే దేశే ఏరండోఽపి ద్రుమాయతే.
చెట్టులేనిచోట నాముదపుచెట్టే మహావృక్షము.

౨౬౧. నిరీక్షతే కేళివనం ప్రవిశ్య క్రమేలకః కంటకజాల మేవ.
లొట్టిపిట్ట శృంగారవనమును బ్రవేశించి ముండ్లనే వెదకును.

౨౬౨. నిర్ధనపురుష శ్శవసమానః.
ధనములేని పురుషుఁడు గతికపటికతో సమానుఁడు.

౨౬౩. నిసర్గనిపుణాః స్త్రియః.
స్వభావముగా స్త్రీలు గడుసరులు.

౨౬౪. నిసర్గశాలీనాః స్త్రియః
స్త్రీలు స్వభావముగా సిగ్గరులు.

౨౬౫. నిస్సారస్య పదార్థస్య ప్రాయేణాడంబరో మహాన్.
తఱుచుగా నిస్సారమగు పదార్థమున కాడంబరము హెచ్చు.
"వట్టిగేదెకు అఱుపు లెక్కువ" అని ఆంధ్రభాషీయము.

౨౬౬. నిస్పృహస్య తృణం జగత్.
నిస్పృహ గలవానికి ననఁగా విరక్తునకు లోకము గడ్డిపోచవంటిది.

౨౬౭. నీచాః కలహ మిచ్ఛంతి సంధి మిచ్ఛంతి సాధవః.
నీచులు కలహమును గోరుదురు. సాధువులు సంధినిఁ గోరుదురు.

౨౬౮. నీచాశ్రయో నకర్తవ్యః కర్తవ్యో మహదాశ్రయః.
నీచుల నాశ్రయింపరాదు. ఉదారుల నాశ్రయింపవలయును.

౨౬౯. నీచై ర్గచ్ఛత్యుపరిచ దశా చక్రనేమిక్రమేణ.
ప్రాణియొక్కదశ చక్రముయొక్క ఆకువలెఁ గ్రిందికినిఁ బైకినిఁ బోవును.

౨౭౦. నీరక్షీరన్యాయము (స్పష్టము)

౨౭౧. నైవాశ్రితేషు గుణదోష విచారణా స్యాత్.
ఆశ్రితులందు గుణదోషములను విచారింపరాదు.

౨౭౨. న్యాయ్యాత్పథః ప్రవిచలంతి పదం న ధీరాః.
ధీరులు న్యాయమార్గమునుండి కాలు కదల్పరు.

౨౭౩. పంగ్వంధన్యాయము.
కాళ్ళులేమినిఁ గుంటివాఁడును, గన్నులులేమిని గ్రుడ్డివాఁడును నడువఁజాలరు. కానీ కుంటివాఁడు గ్రుడ్డివాని భుజముపైఁ గూర్చుండి మార్గప్రదర్శనముఁ జేయుచు గ్రుడ్డిని నడిపించును. అట్లే ప్రకృతి పురుషు లిర్వురును బరస్పరసాహాయ్యమున జగత్తును సృజించుచున్నారని సాంఖ్యమతము.

౨౭౪. పండితః పండితం దృష్ట్వా శ్వానవద్ ఘుర్ఘురాయతే.
పండితుఁడు మరొక పండితునిఁ జూచి కుక్కవలె గుఱ్ఱుపెట్టును.

౨౭౫. పతంగదీప న్యాయము.
మిడుత దీపమును మ్రింగఁబోయి దానిపైఁ బడి మరణించువిధము.

౨౬౬. పతనాంతా స్సముచ్ఛ్రయాః
పెరుగుట విరుగుటకొఱకే.

౨౬౭. పదం హి సర్వత్ర గుణై ర్నిధీయతే.
గుణము లందఱిని మెప్పించును.

౨౬౮. పద్మపత్రస్థితతోయన్యాయము.
తామరాకులోని నీరు తామరాకున కంటదు. అట్లే గృహస్థుఁడయ్యు సంసార బంధమునఁ జిక్కనివానినిఁగూర్చి దీనిని వ్యవహరింతురు.

౨౬౯. పథి శూద్రవదాచరేత్.
ప్రయాణమునందు మార్గమధ్యమందు శూద్రునివలె నాచారములను నాచరింపవలయును. అనఁగా స్వీయాచారమును సమగ్రముగాఁ బాటింప నక్కఱలేదు.

౨౭౦. పయఃపానం భుజంగానాం కేవలం విషవర్ధనమ్.
పాములకుఁ బాలువోయుట విషాభివృద్ధి సేయుటకే.

౨౭౧. పయోముఖవిషకుంభన్యాయము.
"పైనిఁ బాలును అడుగున హాలాహలమును గల కడవ"

౨౭౨. పరద్రవ్యాణి లోష్టవత్.
పరద్రవ్యములను మంటిబెడ్డవలెఁ జూడవలయును.

౨౭౩. పరాన్నం ప్రాణసంకటమ్.
పరులుపెట్టు భోజనమున కాధారపడియుంట ప్రాణసంకటము.

౨౭౪. పరవృద్ధిమత్సరి మనో హి మానినామ్.
మానవంతుల మనస్సు తమ శత్రువుల వృద్ధిని మత్సరించును.

౨౭౫. పరిశేషన్యాయము.
పరిశేషము = మిగులు. "రాజుగారి పెద్దభార్య మంచిది" అనఁగనే రెండవ భార్యను గూర్చి చెప్ప నక్కఱలేకయే చెడ్డది అను నర్థమగును. ఇట్టి యర్థమున దీని నుపయోగింతురు.

౨౭౬. పరోపకారార్థ మిదం శరీరమ్.
ఈ శరీరము పరోపకారార్థము.

౨౭౭. పాపాత్మనాం పాపశతేన కింవా ?
పాపస్వరూపులకుఁ బాపశత మొకలెక్కా ?

పాపీ చిరాయు స్సుకృతీ గతాయుః.

పాపి చిరకాలము బ్రతుకును. సుకృతి యల్పకాలము బ్రతుకును.

• పాపీ పాపేన హన్యతే.

ఏవనిపాపము వానినిఁ జంపును.

• పిపీలికాన్యాయము.

తెలుఁగున "చీమ గంగాయాత్ర" అందురు. చీమ వృక్షాగ్రస్థితమగు ఫలము యొక్క రసమునుద్రాగుటకై మెల్లఁగాఁ బ్రాఁకిప్రాఁకిపోయి దానిని నాస్వాదించును. అట్లే కొందఱు గృహస్థులు సంసారబంధములనుండి శీఘ్రముగా ముక్తినిఁ బొందఁజాలక మెల్లమెల్లఁగాఁ బెక్కుజన్మములకుఁ బొందుదురు. అట్టియెడ నీ న్యాయము వర్తించును.

• పిశాచానాం పిశాచభాషయై వోత్తరం దేయమ్.

మొండివానికి మొండిజవాబునే చెప్పవలెను.

౧. పిష్టపేషణన్యాయము. (స్పష్టము)

౨. పుత్రశ్శత్రు రపండితః.

అపండితుఁడగు పుత్రుఁడు శత్రువు.

౩. పుత్రా దిచ్ఛేత్పరాజయమ్.

తానందఱిని జయింపవలెను. పుత్రుఁడు దన్నుజయింపవలెనని తండ్రి కాంక్షింపవలెను.

౪ పురాణ మిత్యేవ న సాధు సర్వమ్.

పురాతనమైన దెల్లయు మంచిదికాదు.

౫. పురాణ వైరాగ్యము, ప్రసూతివైరాగ్యము, శ్మశాన వైరాగ్యము. (స్పష్టము)

౬. పూర్వావధీరితం శ్రేయో దుఃఖం హి పరివర్తతే.

మొదటఁ ద్రోసిపుచ్చినమేలు కీడుగాఁ దిరిగివచ్చును.

౭. పృథివీ గతయౌవనా.

భూదేవికి యౌవనము గడచినది. దీని మూల మిది.

అతిక్రాంత సుఖాః కాలాః; ప్రత్యుపస్థిత దారుణాః
శ్వః శ్వః పాపీయదివసాః పృథివీ గతయౌవనా.

౨౯౮. పృష్ఠతాడనా ద్దంతభంగః.
"ముడ్డిమీదఁ గొట్టఁగా మూతిపండ్లు రాలుట"

౨౯౯. ప్రక్షాళనాద్ధి పంకస్య దూరా దస్పర్శనం వరమ్.
"అడుసుత్రొక్కనేల? అడుగుఁ గడుగనేల?" అని యేతత్సజాతీయజాతీయము.

౩౦౦. ప్రతీక్షతే జాతు నకాల మార్తిః.
కష్టములు కాలమునకు వేచియుండవు.

౩౦౧. ప్రత్యుత్పన్నమతి స్త్రైణమ్.
స్త్రీలు సమయస్ఫూర్తి గలవారు.

౩౦౨. ప్రథమకబళే మక్షికాపాతః.
"మొదటి ముద్దలోనే యీఁగపడి చచ్చినది" "ఆదిలోనే హంసపాదు" అని ఆంధ్రజాతీయములు.

౩౦౩. ప్రథమాలీఢమధవః పిబంతి కటు భేషజమ్.
మొదటఁ దేనెను నాకినవారు చేదుమందును ద్రాగుదురు.

౩౦౪. ప్రధానమల్లనిబర్హణన్యాయము.
ప్రతిమల్లురు పెక్కండు న్నప్పుడు ప్రధానమల్లుని గెలిచినచో నెల్లరను గెలిచినట్లే యగును.

౩౦౫. ప్రభూణాంహి విభూత్యంధా ధావత్యవిషయే మతిః.
సిరిచే గ్రుడ్డిబాఱిన ప్రభువుల మనస్సు అకార్యములపైకిఁ బర్విడును.

౩౦౬. ప్రమాదో ధీమతా మపి.
ఒకప్పుడు విద్వాంసులకును బొరపాటు వచ్చును.

౩౦౭. ప్రసిద్ధ మూర్ధ్వజ్వలనం హవిర్భుజః
అగ్నికూర్ధ్వముఖముగా మండుట ప్రసిద్ధము. ప్రతాపశాలికిఁ బ్రతివీరునిపై స్పర్ధ సహజము.

౩౦౮. ప్రాప్తేతు షోడశేవర్షే గర్దభీ హ్యప్సరాయతే.
పదాఱవయేఁడురాఁగానే గాడిదయు నప్సరయగును. అనఁగా యౌవనము రాఁగానే గాడిదవలె నున్న స్త్రీయు నప్సరవలెఁ గనబడును.

౩౦౯. ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః.
పెద్దలకు సందేహము గల్గినపుడు వారి యంతఃకరణమే ప్రమాణము.

౩౧౦. ప్రయోజన మనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే.
ప్రయోజనము లేక పామరుఁడును బ్రవర్తింపఁడు.

౩౧౧. ప్రాప్తేఽపి సోమయాజిత్వే నంబిత్వం నైవ ముంచతి.
నంబివాఁ డొకఁడు తన్నందఱు "నంబి నంబి"యని పిలుచుచుండఁగా సహింపక తాను యజ్ఞ మొనర్చినచో సోమయాజి యని పిలుతురుగదా యని యెంచుకొని బహువ్యయముతో యజ్ఞము సేసెనఁట. అనంతర మందఱును నంబిసోమయాజు లని పిలువసాగిరఁట.

౩౧౨. ప్రాయేణ భార్యాదౌశ్శీల్యం స్నేహాంధో నేక్షతే జనః.
మోహాంధుఁడు తన పడఁతిచెడునడతను బరికింపఁజాలఁడు.

౩౧౩. ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః.
తఱచుగా బ్రహ్మ గుణసమగ్రతను గూర్చుటయందు విముఖుఁడు.

౩౧౪. ప్రేమ్ణో విచిత్రా గతిః.
ప్రేమయొక్క తీరు విచిత్రమైనది.

౩౧౫. ప్రియేషు సౌభాగ్యఫలాహి చారుతా.
స్త్రీల సౌందర్యము భర్తృమనోహరణార్థమేకదా!

౩౧౬. బకబంధనన్యాయము
కొంగను బట్టుట కొకఁ డొక యుపాయమును జెప్పెను. "బకము నీటిలో నిలిచి జపము సేయుచున్నట్లుండఁగా వెన్నముద్దను గొనిపోయి దాని శిరస్సున నుంపవలయును. అది కరఁగి దాని కన్నులలోఁ జొచ్చును. అప్పుడు కన్ను లగపడవు. అంత దానినిఁ బట్టవచ్చును" అని.

౩౧౭. బలవదపి శిక్షితానా మాత్మ న్యప్రత్యయం చేతః.
మిక్కిలి శిక్షణ బొందిన వారికిని ఆత్మవిశ్వాస ముండదు.

౩౧౮. బలీయసీ కేవల మీశ్వరేచ్ఛా.
ఈశ్వరేచ్ఛ యన్నింటి కన్న బలవత్తరము.

౩౧౯. బహురత్నా వసుంధరా.

భూమియం దనేకరత్నములు గలవు. ఇది వాచ్యార్థమునఁ గాక "భూమియం దనేకులు మహావిద్వాంసులు గలరు" అను వ్యంగ్యార్థమునఁ బ్రయుక్తమైయున్నది.

౩౨౦. బహ్వారంభో లఘుక్రియా.

మొదట పెద్దపెట్టునఁ గనబడినను తుదికి సూక్ష్మముగా ముగియుట.

"అజాయుద్ధే ఋషిశ్రాద్ధే ప్రభాతే మేఘడంబరే
దంపత్యోః కలహే చైవ బహ్వారంభో లఘుక్రియా."

౩౨౧. బాలాదపి సుభాషితమ్.

బాలుఁడైనను మంచిమాటలు పలికినచో గ్రహింపవలయును.

౩౨౨. బాదరాయణసంబంధన్యాయము (స్పష్టము)

దీని మూల మిది;

"యుష్మాకం బదరీచక్రం అస్మాకం బదరీతరుః
బాదరాయణసంబంధా ద్యూయం యూయం వయంవయం"

(క) కానీ యీ యర్థమున "బాదరసంబంధ" మనవలెను గానీ బాదరాయణసంబంధ మనరాదు. ఈ యర్థమున బాదరాయణపదము సాధ్యముగాదు.

౩౨౩. బీజాంకురన్యాయము.

దీనినే "చెట్టు ముందా? విత్తు ముందా?" అందురు.

౩౨౪. బుభుక్షితః కిం న కరోతి పాపమ్.

ఆకలిగొన్నవాఁ డే పాపమును జేయఁడు?

"ఆఁకలిగొన్న కరణము పాతకవిలె దీసినాఁడు" అని ఆంధ్రజాతీయము.

౩౨౫. బుభుక్షితః కిం ద్వికరేణ భుంక్తే?

ఆఁకలిగొన్నవాఁడు రెండుచేతులతోఁ దినునా?

౩౨౬. బ్రాహ్మణపరివ్రాజకన్యాయము- బ్రాహ్మణశ్రమణన్యాయము.

బ్రాహ్మణుఁడు గృహస్థధర్మమును విసర్జించి సన్న్యాసమును గ్రహించినను వానికిఁ గులభేదములు లేకున్నను బ్రాహ్మణుఁడనియే వ్యవహరింపఁబడును.

౩౨౭. బ్రువతే హి ఫలేన సాధవో నతు కంఠేన నిజోపయోగితామ్.

సాధువులు దమ సాయమును గంఠముతోఁ దెలుపక ఫలముతోఁ జూపింతురు.

౩౨౮. భవితవ్యానాం ద్వారాణి భవంతి సర్వత్ర.
అవశ్యముగాఁ గావలసినవాని కన్నియును మార్గములే.

౩౨౯. భవంతి భవ్యేషు హి పక్షపాతాః
అర్హులయందుఁ బక్షపాతములు గలుగును.

౩౩౦. భాగ్యం ఫలతి సర్వత్ర.
ఎల్లెడలను అదృష్టము ఫలించును. విద్యాపౌరుషములు గావు.

౩౩౧. భార్యా రూపవతీ శత్రుః.
రూపవంతురాలైన భార్య రూపహీనుఁడగు భర్తకు శత్రువు.

౩౩౨. భుజంగ ఏవ జానీతే భుజంగచరణం సఖే!
పాము కాళ్ళు పాము నకెఱుక.

౩౩౩. భూతాని కాలః పచతి.
కాలము జీవకోటిని నుపచయాపచయములను బొందించును.

౩౩౪. భేకోఽపి పాదప్రసారణాయ చేష్టతే.
కప్పయును గాళ్ళుసాఁచుకొనుటకుఁ జూచుచున్నది. అసమర్థుఁడయ్యు సమర్థుల ననుకరింపఁ బోయినపుడు దీని నుపయోగింతురు.

౩౩౫. భ్రమరకీట న్యాయము (రూ) భృంగకీటన్యాయము.
తుమ్మెద యొక పురుగును దెచ్చి గూటఁబెట్టి దాని చుట్టు జుమ్ము జుమ్మని తిరుగుచుండఁ గొంతకాలమున కా పురుగు తుమ్మెద యగువిధము.

౩౩౬. మజ్జనోన్మజ్జనన్యాయము.
"మునుఁగుట తేలుట మఱల మునుఁగుట తేలుట"

౩౩౭. మతిరేవ బలాద్గరీయసీ.
బలముకన్న బుద్ధియే గొప్పది.

౩౩౮. మధ్యమణిన్యాయము.
భూషణ మధ్యస్థాపిత మగు మణి యిరువలఁకులకును గాంతి నిచ్చునట్లు రెండు వైపులకును పదము లన్వయించునపుడు దీని నుపయోగించును. దేహళీదత్తదీపన్యాయమువంటిది.

౩౩౯. మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః.
మనుష్యుని బంధమోక్షములకు మనస్సే కారణము,

౩౪౦. మనోరథానాం గతిర్న విద్యతే.
మనోరథములకు దూఱరానిచోటు లేదు.

౩౪౧. మనోరథానా మతటాః ప్రవాహాః.
మనోరథప్రవాహములకుఁ గట్టలు లేవు.

౩౪౨. మనోహి జన్మాంతరసంగతిజ్ఞమ్.
మనస్సు జన్మాంతర సంబంధమును దెలిసికొనును.
ఇట్టిదే "వక్తి జన్మాంతరప్రీతిం మన స్స్నిహ్యా దకారణం" అనునదియు.

౩౪౩ మరణాంతాని వైరాణి.
వైరములకు మరణమే యవధి.

౩౪౪. మర్కటకిశోరన్యాయము
కోతియొక్క నడుమును బిడ్డ గట్టిగాఁ బట్టుకొనును. ఏమాత్రము వదలుగాఁ బట్టుకొన్నను బిడ్డ జారిపడును. ఇట బిడ్డదే భారము. ఇవ్విధముననే జ్ఞాని యీశ్వరునిఁ బట్టుకొని మోక్ష మొందవలయును.

౩౪౫. మర్దనం గుణవర్ధనమ్.
మందెంత మర్దించిన నంత దాని గుణము హెచ్చును.

౩౪౬. మహాత్మో నాస్తి పాతకమ్
పెద్దలకుఁ బాప మంటదు.

౩౪౭. మహాగజాః పలాయంతే మశకానాంతు కా కథా?
పెద్దపెద్ద యేనుఁగులే పరుగిడుచుండ దోమలమాట చెప్పనేల?

౩౪౮. మహాజనో యేనగత స్సపంథాః
పెద్దలు నడచినదే త్రోవ.

౩౪౯. మహాన్ మహత్యేవ కరోతి విక్రమమ్.
గొప్పవాఁడు గొప్పవానినే డీకొనును.

౩౫౦. మహిషీ ప్రసవోన్ముఖీ మహిషో మదనాతురః
"గేదె యీన నున్నది. దున్నపోతు దానిపై నెక్కనున్నది.

3౫౧. మార్జాల కిశోరన్యాయము.

పిల్లి తన పిల్లలను దానే నోటఁగఱచుకొని భద్రముగాఁ గొనిపోవును. ఇందు భారమంతయుఁ దల్లిదే. ఈశ్వరుఁడును భక్తునిఁ దద్విధముగనే యుద్ధరించును.

3౫౨. మార్దవే బహవో దోషాః.

మార్దవమునఁ బెక్కుదోషములు గలవు. "మెత్తనివానినిఁ జూచిన మొత్తబుద్ధి యగు"నని సజాతీయ మగు నాంధ్రలోకోక్తి.

3౫3. మాంసం మాంసేన వర్ధతే

మాంసము మాంసముచే వర్ధిల్లును.

3౫४. ముఖే ముఖే సరస్వతీ.

"ప్రతివాని ముఖమందును సరస్వతి గలదు" అనఁగా సరస్వతి యొకరిసొత్తు గాదు. ఆమె బ్రహ్మముఖమున మాత్రమే యుండదు. ఎల్లరి ముఖములందును గలదు.

3౫౫. మునీనాంచ మతిభ్రమః

మునులకును మతిభ్రమము గలుగును.

3౫౬. మురారే స్తృతీయః పంథాః

మురారిది మూఁడవదారి.

3౫౭. ముసలః కిసలాయతే.

"రోఁకలి చిగిరించినట్లు"

3౫౮. మూఢః పరప్రత్యయనేయబుద్ధిః.

మూఢుఁడు పరులమాటలందు విశ్వాసముగలవాఁడు. అనఁగా స్వయముగా నాలోచించి నిర్ణయింపఁ జాలఁడు.

3౫౯. మృదు తీక్ష్ణతరం (యా) మృదు స్సుతీక్ష్ణః.

మృదువైనది తీక్ష్ణముగా నుండును. (మెత్తనిపులి అన్నట్లు)

3౬౦. మూలే ఛిన్నే కుతః శాఖాప్రరోహః.

వేరు గొట్టివేయఁగాఁ గొమ్మ లెట్లు మొలచును ?

3౬౧. మేఘచాతకన్యాయము.

చూ. చాతకజీమూతన్యాయము.

౩౬౨. మేషపుచ్ఛన్యాయము.
మేఁకతోఁక యెప్పుడును బెత్తెఁడే. ఎదుగును బొదుగునులేని విధము.

౩౬౩. మౌన మర్ధాంగీకారః (స్పష్టము).

౩౬౪. మౌనం సర్వత్ర సాధకమ్.

౩౬౫. మౌనం పండితలక్షణమ్.
సభలోఁ బామరుఁడు వదరును. పండితుఁడు పలుకకుండును. "నిండుకుండ తోఁణఁ కదు" అని ఆంధ్రభాషీయము.

౩౬౬. మౌనేన కలహో నాస్తి.
మౌనమువలనఁ గలహ మంతరించును.

౩౬౭. యతో ధర్మ స్తతో జయః (స్పష్టము).

౩౬౮. యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః
ప్రయత్నముచేసినను గార్యము సిద్ధింపకున్న దోషమేమి?

౩౬౯. యత్రాకృతి స్తత్ర గుణా భవంతి, (రూ) నహ్యాకృతి స్సుసదృశం విజహాతి వృత్తమ్.
అందమున్నచోటఁ జందమును జక్కఁగనే యుండును.

౩౭౦. యథానామ తథాగుణః.
పేరెట్టిదో గుణమును నట్టిదే.

౩౭౧. యథా పితా తథా పుత్రః.
తండ్రి యెట్టివాఁడో తనయుఁడును నట్టివాఁడు

౩౭౨. యథా బీజం తథాంకురం.
విత్తన మెట్టిదో మొలకయు నట్టిదే.

౩౭౩. యథాభావ స్తథా దేవః.
భావ మెట్టిదో దేవుఁడును నట్టివాఁడే.

౩౭౪. యథా రాజా తథాప్రజా (స్పష్టము)

౩౭౫. యథార్థవాదీ లోకవిరోధీ.
యథార్థమును బలుకువాఁడు లోకమునకు శత్రువు.

౩౭౬. యథాసంఖ్యా న్యాయము (స్పష్టము).

౩౪౭. యది హృదయ మశుద్ధం తస్య సర్వం విరుద్ధమ్.
హృదయ మశుద్ధమయ్యేనేని వానికి సర్వమును విరుద్ధముగానే తోఁచును.

౩౪౮. యద్గతం తద్గతం గతమ్.
పోయినది పోయినదే. అనఁగాఁ దిరిగి రాదన్న మాట.

౩౪౯. యవాః ప్రకీర్ణా న భవంతి శాలయః
యవలను జల్లఁగా వరి పండదు. పూర్వజన్మమునఁ బాపము సేసియుండఁగా నేఁడు తత్ఫలమే కలుగును గాని పుణ్యఫలము కలుగదు.

౩౫౦. యశో వా మృత్యుర్వా
కీర్తి గాని మరణము గానీ. "రణానికి పోతే రెంటిలో నొకటి" అని ఆంధ్రజాతీయము.

౩౫౧. యాచకో యాచకస్య శత్రుః (స్పష్టము)

౩౫౨. యాదృశీ మాతా తాదృశీ పుత్రీ
తల్లియెట్టిదో బిడ్డయట్టిది. "తల్లి చాలు పిల్లకుఁ దప్పునా ?" అని సదృశమైన యాంధ్రజాతీయము.

౩౫౩. యావ త్తైలం తావ ద్వ్యాఖ్యానమ్
దీపమునఁ జమురెంతయున్నదో యంత వ్యాఖ్యానము.
"పిండికొద్ది రొట్టె" అని సదృశమైన ఆంధ్రభాషీయము.

౩౫౪. యేన కేన ప్రకారేణ ప్రసిద్ధః పురుషో భవేత్
పురుషుఁ డేదోవిధముగా నైనఁ బ్రసిద్ధినిఁ బొందవలెను.

౩౫౫. రత్నం రత్నేన సంగచ్ఛతే.
రత్నము రత్నముతోఁ గలియును.

౩౫౬. రత్నగర్భా వసుంధరా
భూమి రత్నగర్భ; అనఁగా ననేక శ్రేష్ఠవస్తుసముదాయము గలది.
చూ. బహురత్నా వసుంధరా

౩౫౭. రత్నం సమాగచ్ఛతు కాంచనేన.
రత్నము బంగారముతోఁ గూడునుగాక.

౩౫౮. రత్నాకరే యుజ్యత ఏవ రత్నమ్
రత్నాకరమున రత్నముండుట యుక్తమేకదా!

౩౮౯. రమ్యాణాం వికృతి రపి శ్రియంతనోతి.

స్వభావముచే నందమైనవారికి వికారముగూడ నందముఁ దెచ్చును.

౩౯౦. రాజ్యాంతే నరకం ధ్రువమ్

రాజునకు రాజ్యాంతమున నరకము తప్పదు.

౩౯౧. రామాయ స్వస్తి రావణాయ స్వస్తి.

రామునికిని మేలగుఁగాక, రావణునికిని మేలగుఁగాక. ఇరువుర శత్రువులు పోరాడుకొనుచుండ నే పక్షమునను జేరక యుభయుల క్షేమమును గోరినవాని మాట యిది.

౩౯౨. రామరావణయో ర్యుద్ధం రామరావణయో రివ.

రామరావణయుద్ధము రామరావణ యుద్ధమువలెనే యున్నది. దీని పూర్వార్థము "గగనం గగనాకారం సాగర స్సాగరోపమః"

౩౯౩. రాజా ప్రత్యక్షదేవతా.

రాజే ప్రత్యక్షమగు దైవము

౩౯౪. రాజా ప్రకృతి రంజనాత్.

ప్రజారంజనము వలననే "రాజు" అనఁబడును.

౩౯౫. రిక్తః సర్వో భవతి హి లఘుః పూర్ణతా గౌరవాయ.

రిక్తుఁడగు ప్రతివాఁడును తేలికగాఁ జూడఁబడును. పూర్ణుఁడు పూజ్యుఁడగును చూ. గౌరవం లాఘవం చాపి

౩౯౬. లంఘనం పరమౌషధమ్.

భోజన నివృత్తియే మంచిమందు.

౩౯౭. లజ్జా మేకాం పరిత్యజ్య త్రిలోకీ విజయీ భవేత్

ఒకసిగ్గును విడిచి యనఁగా సిగ్గొక్కటి విడిచెనేని ముల్లోకములను జయించున

౩౯౮. లలాట లేఖా న పునః ప్రయాతి.

నుదుటి వ్రాఁత చెఱుఁగదు.

౩౯౯. లిఖిత మపి లలాటే ప్రోజ్ఝితుం కః సమర్థః ?

నుదుట వ్రాసిన వ్రాఁత నెవఁడు తుడిచివేయఁగలఁడు?

౪౦౦. లోకో భిన్నరుచిః (రూ) భిన్నరుచి ర్హి లోకః (స్పష్టము)

౪౦౧. లోభః పాపస్యకారణమ్.

లోభము పాపమునకుఁ గారణము.

౪౦౨. వక్రే విధౌ వద! కథం వ్యవసాయసిద్ధిః

విధి వక్రించి యుండఁగాఁ గార్యసిద్ధి యెట్లు?

౪౦౩. వక్తి జన్మాంతర ప్రీతిం మన స్స్నిహ్యా దకారణమ్.

అకారణముగా మనస్సు దేనియందో స్నిగ్ధమై జన్మాంతరప్రీతిని వచించును.

౪౦౪. వచనే కా దరిద్రతా?

మాటలలో నెవరికిఁ బేదతనము గలదు ?

౪౦౫. వజ్రం వజ్రేణ భిద్యతే (స్పష్టము)

౪౦౬. వజ్రలేపన్యాయము.

గట్టితనమునకై వజ్రమును (సిమెంటు మొ.) బూసినట్లు యుక్తులపై యుక్తులను దొరలించి దోషాదులను స్థిరీకరించునపుడు దీని నుపయోగింతురు.

౪౦౭. వంధ్యాపుత్రన్యాయము.

బిడ్డలులేని స్త్రీ వంధ్య. వంధ్యకుఁ బుత్రుఁడెక్కడ? అత్యంతాసంభవ మను నర్థమున నిది వ్యవహరింపఁబడును.—దీనిమూలమిది—

యావజ్జీవ మహంమౌనీ బ్రహ్మచారీచ మే పితా

మాతాతు మమ వంధ్యైవ పుత్రహీనః పితామహః

౪౦౮. వసంతి హి ప్రేమ్ణి గుణా న వస్తుషు.

గుణములు ప్రేమయందుండునుగానీ వస్తువులం దుండవు.

౪౦౯. వాచః కర్మాతిరిచ్యతే.

కట్టిమాటకన్న గట్టిపని మేలు.

౪౧౦. వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసి తఏవ ధీరాః

వికారము గలుగుటకుఁ దగిన కారణమున్నను నెవరి మనస్సు వికారమును బొందదో వారే ధీరులు.

౪౧౧. విక్రీతే కరిణి కి మంకుశే వివాదః.

ఏనుఁగు నమ్మిన పిమ్మట నంకుశమునకై వివాద మేల?

౪౧౨. విద్యావిహీనః పశుః (స్పష్టము)

౪౧౩. విద్యాక్ సర్వత్ర పూజ్యతే.

౪౧౪. విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్.

విద్వాంసుఁడే విద్వాంసుల పరిశ్రమ నెఱుఁగును. దీని యుత్తరార్థ మిది. "నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనాం"

౪౧౫. విధి రహో బలవా నితి మే మతిః.

అన్నిటికన్న విధియే బలవత్తర మని నాయూహ.

౪౧౬. విధౌ వక్రే మూర్ధ్ని స్థితవతి వయం కే పునరమీ?

తలపై విధివక్రించి కూర్చుండఁగా మన మెవ్వరము? వీ రెవ్వరు? అనఁగా నెవ రేమి చేయఁగలరు?

౪౧౭. వినాశకాలే విపరీతబుద్ధిః.

చెడుకాలమునకుఁ జెడుబుద్ధి పుట్టును.

౪౧౮. వినిపాతో౽పి సమః సమున్నతేః

వినిపాతముకూడ నున్నతికిఁ దగినవిధముగానే యుండును. అనఁగాఁ బైకి నెంత దూర మెగిరిన నంతదూరము క్రిందఁబడవలెను.

౪౧౯. విపది హంత సుధాపి విషాయతే.

ఆపత్కాలమున నమృతమును విషమగును. "కాని కాలమునకుఁ గఱ్ఱె పామై కఱచును" అని సజాతీయభాషీయము.

౪౨౦. విప్రవాక్యం జనార్దనః. (ప్రశస్యతే)

జనార్దనుఁడు విప్రవాక్యము మంచి దని ప్రశంసించెను.

౪౨౧, విప్రాః పశ్చిమబుద్ధయః

బ్రాహ్మణులకు బుద్ధి వెడతలనుండును. బ్రాహ్మణులన వేదజడులని చెప్పవలెను. దీనినే "బుద్ధి జాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్" అని పెద్దన మరొక విధముగాఁ జెప్పినాఁడు.

౪౨౨. విభూషణం మౌన మపండితానామ్.

సభలో మాటాడ కూరకుంటయే మూర్ఖుల కలంకారము.

౪౨౩. వివక్షితం హ్యనుక్త మనుతాపం జనయతి.

చెప్పఁదలఁచినది చెప్పకున్నఁ బశ్చాత్తాపముఁ గలిగించును.

౪౨౪, వివాహశ్చ వివాదశ్చ సమయో రేవ శోభతే.

వివాహమును వివాదమును సమానులగువారికే శోభిల్లును.

౪౨౫. వివేకభ్రష్టానాం భవతి వినిపాత శ్శతముఖః.
వివేకభ్రష్టులు శతముఖముల వినిపాతమును బొందుదురు.

౪౨౬. విశుద్ధసత్త్వా విరళాః పునః స్త్రియః.
శుద్ధస్వభావముగల స్త్రీ లరుదు.

౪౨౭. విషకృమిన్యాయము.
విషమునఁ బుట్టిన పురుగు విషమువలననే పెరుగును.

౪౨౮. విషస్య విషమౌషధమ్. (స్పష్టము)

౪౨౯. విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్.
విషవృక్షము నైనను బెంచి తన చేతులతోడనే త్రుంచుట యుచితముగాదు.

౪౩౦. విహంగమన్యాయము.
పక్షియెగిరిపోయినవిధమునఁ బూర్వజన్మకర్మపరిపాకమున సత్వరముగాఁ గర్మబంధమునుండి ముక్తుఁడై యెగిరిపోవును. ఇట్టిచో నిది ప్రయుజ్యమానమగును.

౪౩౧. వృణుతే హి విమృశ్యకారిణం గుణలుబ్ధా స్స్వయమేవ సంపదః.
విమర్శించి కార్యమాచరించు వానిని సంపదలు వరించును.

౪౩౨. వృద్ధస్య తరుణీ భార్యా ప్రాణేభ్యోఽపి గరీయసీ
వృద్ధునకుఁ బడుచుపెండ్లాము ప్రాణముల కన్నను నధికము.

౪౩౩. వృద్ధా నారీ పతివ్రతా (స్పష్టము)

౪౩౪. వృద్ధా వేశ్యా తపస్వినీ. (స్పష్టము)

౪౩౫. వృషభకలహే వత్సపాదభంగః.
ఆఁబోతును, ఆబోఁతును గ్రుమ్ములాడఁగా నడిమిని లేగకాళ్ళు విఱిగినవి.

౪౩౬ వైద్యే మిత్రే నిరంతరా కథా.
వైద్యునితో మిత్రునితోఁ జెప్పుమాటల కంతము లేదు.

౪౩౭. వైశ్యో విశ్వాసఘాతుకః
కోమటి నమ్మినవానికి ద్రోహము సేయువాఁడు.

౪౩౮. వ్యాసఘట్టము.
గ్రంథములందుఁ గఠినభాగము.

౪౩౯. శతం విహాయ భోక్తవ్యమ్ (స్పష్టము)

౪౪౦. శతశ్లోకేన పండితః ,,

౪౪౧. శతపత్త్రపత్త్రశతభేదన్యాయము.

నూరుతామరరేకులను బట్టుకొని సూదితో గ్రుచ్చఁగా సూది వానిలోఁ గ్రమముగాఁ బ్రవేశించినను ఆ క్రమము గోచరముగాదు. ఈ న్యాయ మసంలక్ష్యక్రమవ్యంగ్యమున నుపయుక్తము.

౪౪౨. శతాంధాః కూపం ప్రవిశంతి.

నూరుగురు గ్రుడ్డివారు బావిలోఁ బడుచున్నారు.

౪౪౩. శత్రోరపి గుణా వాచ్యా దోషా వాచ్యా గురోరపి.

శత్రువుయొక్కయు గుణములను జాటింపవలెను. గురువుయొక్కయు దోష ముల నుద్ఘాటింపవలయును.

౪౪౪. శనైః శనైః క్షిపే త్పాదమ్.

అడుగు మెల్లమెల్లఁగా నుంచవలెను.

౪౪౫. శరపురుషీయ న్యాయము.

శరము వచ్చినది, పురుషుఁడు వచ్చినాఁడు. శరము వానికిఁ దగిలినది. ఇది అజా కృపాణీయము వంటిది.

౪౪౬. శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్. (స్పష్టము)

౪౪౭. శరీరం వ్యాధి మందిరం ,,

౪౪౮. శవజాగరణ న్యాయము. (స్పష్టము)

౪౪౯. శవోద్వర్తన న్యాయము.

"పీనుఁగునకు నలుఁగుపెట్టుట" "పీనుఁగునకుఁజేసినజాతర" అని ఆంధ్రభాషీయములు.

౪౫౦. శశవిషాణన్యాయము.

"కుందేటికొమ్ము" "గగనారవిందము" వంటిది.

౪౫౧. శాకాయ వా స్యాత్ లవణాయ వా స్యాత్.

కూరకా? ఉప్పునకా?

౪౫౨. శాఖాచంక్రమణన్యాయము.

కోఁతి యొకశాఖనుండి మరొకశాఖకును దానినుండి యింకొక శాఖకును దిరు గును. అట్లే యొక విషయము నుపన్యసింపఁ బూని దానినుండి వేరొకదానికి దానినుండి మరొకదానికినిఁ బోయి మొదటి విషయము వదలివేయుట.

౪౫౩. శాఖాచంద్రన్యాయము.

బాలునకుఁ జెట్టుకొమ్మమీఁదుగాఁ జంద్రునిఁ జూపుట. అనఁగా ముందు చెట్టు కొమ్మను, బిమ్మటఁ జంద్రునిఁ జూపి చెట్టుకొమ్మను వదలి చంద్రునిని మాత్రమే చూడుమని బాలున కుపదేశించినట్లు పంచకోశశూన్యుఁ డగు పరబ్రహ్మను మొదటఁ గోశదృష్టితోఁ జూపి పిమ్మటఁ గోశములను వదలి చూడుమని గురు వుపదేశించును.

౪౫౪. శామ్యే త్ప్రత్యపకారేణ నోపకారేణ దుర్జనః.

దుర్జనుఁడు ప్రత్యపకారముచే శాంతిల్లును గానీ యుపకారముచే శాంతిల్లఁడు.

౪౫౫. శాస్త్రా ద్రూఢి ర్బలీయసీ.

శాస్త్రముకన్న రూఢి బలవత్తరము. 'యోగాద్రూఢిర్బలీయసీ' అనియు గలదు.

౪౫౬. శిరో నాస్తి శిరోవ్యథా.

మొదలు శిరస్సే లేదు. శిరోవ్యథ యఁట!

౪౫౭. శిలాక్షరన్యాయము.

రాతిపైఁ జెక్కిన యక్షరము (నిలుకడగలది)

౪౫౮. శిష్యాపరాధే గురో ర్దండః

శిష్యుఁ డపరాధము సేయ గురువును దండింపవలయును.

౪౫౯. శీఘ్రబుద్ధేః పలాయనమ్

తాను దోషిగా నిర్ణయింపఁబడినట్లును దండింపఁబడునట్లును నిశితబుద్ధిచేఁ దెలిసికొన్నవాని కృత్యము పలాయనము మాత్రము.

౪౬౦. శీతాంశో రమృతార్పణమ్.

అమృతకిరణునకు నమృతము నైవేద్యముగా నర్పించుట.

౪౬౧. శీర్షే సర్పో దేశాంతరే వైద్యః.

తలపైఁ బాము, దవ్వుల వైద్యుఁడు.

౪౬౨. శుచి మనో యద్యస్తి తీర్థేన కిమ్.

మనస్సు శుచిగా నున్నచోఁ దీర్థ మేల ?

౪౬౩. శుభస్య శీఘ్రం అశుభస్య కాలహరణమ్.

శుభమునకుఁ ద్వరగాఁ బూనవలయును. అశుభమున కాలస్యము సేయవలెను,

౪౬౪. శృంగగ్రాహికా న్యాయము.

ఆవులమందలోనికిఁ బోయి "నా ఆవేది?" అని యడిగినచో గొల్లవాఁడు దానికొమ్మును బట్టి చూపును. కొమ్మును జూపిన మాత్రమున గోవు తెలిసి కొనఁబడిన విధమున స్వల్పలక్షణముచే సర్వమును దెలిసికొనునపు డిది యుపయుక్త మగును.

౪౬౫. శేషం కోపేన పూరయేత్ (స్పష్టము)

౪౬౬. శ్రాద్ధే శాకచతుష్టయమ్

తద్దినమునాఁడు నాలుగు కూరలు వండవలెను.

౪౬౭. శ్రియ స్సమృద్ధా అపి హంతి దుర్నయః

చెడ్డతనము సమృద్ధమైన సిరిని హరించును.

౪౬౮. శ్రేయసి కేన తృప్యతే?

మేళ్ళుచాలునని యెవ్వడు తృప్తిపడును.

౪౬౯. శ్రేయాంసి బహువిఘ్నాని భవంతి మహాతా మపి.

పెద్దపెద్దలకును శ్రేయములకు విఘ్నములు గలుగును.

౪౭౦. శ్రోత్రియవిట న్యాయము.

ఒక శ్రోత్రియుఁడు భోగము దానివద్దకుఁ బోవ నదియు నాతని యధరపాన మాచరింపఁబోఁగా నాతఁ డిట్లనెనఁట. "వేదాధ్యయనముచేఁ బవిత్రమగు నా ముఖమును నెంగిలి సేయకుము. నీకంత ప్రీతియున్నచో నా యెడమచెవినిఁ గొఱుకుము" ఎడమచెవి నని యేల చెప్పవలె నన్నఁ గుడిచెవి గాయత్రీమంత్రోపదేశముచేఁ బవిత్రమయినదికదా.

సామగాయనపూతం మే నోచ్ఛిష్ట మధరే కురు
ఉత్కంఠితాసిచే ద్భద్రే! వామం కర్ణం దశస్వ మే.

౪౭౧. శ్వపుచ్ఛ న్యాయము.

"కుక్కతోఁక ఋజువుగా సాఁగదు.

౪౭౨. షట్కర్ణో భిద్యతే మంత్రః.

ఆఱుచెవులు గల అనఁగా ముగ్గురికిఁ దెలిసిన రహస్యము బ్రద్దలగును.

౪౭౩. సతాం సంగో హి భేషజం.

సజ్జనసహవాసము మందు; అనఁగా మందువలెఁ బనిసేయును.

౪౭౪. సతి కుడ్యే చిత్రమ్.

గోడయున్నచోఁ జిత్తరువును వ్రాయవచ్చును. "పాండుత్రిక లున్నచో నేముడి యైనను వేయవచ్చును" అని ఆంధ్రభాషీయము.

౪౭౫. సత్యం వద (స్పష్టము)

౪౭౬. సత్యేన లోకాన్ జయతి.

సత్యముచే నెల్లలోకములను జయించును.

౪౭౭. సతి భుక్తిర్నతే నిద్రా. (స్పష్టము)

౪౭౮. సత్సంగతాని నిధనాన్యపి తారయంతి.

మంచివారితోడి మైత్రి మరణమును గూడఁ దప్పించును.

౪౭౯. సభా సప్తాంగలక్షణా.

రాజసభ స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గబలాన్వితులు గలది, లేక నట విట గణికా కవి గాయక వేదశాస్త్రవేత్తలను సప్తాంగములు గలది.

౪౮౦. సమానశీలవ్యసనేషు సఖ్యమ్.

సమాన శీలము, సమానవ్యసనము గలవారికి సఖ్యము గుదురును.

౪౮౧. సర్వం బలవతః పథ్యమ్.

బలవంతుఁ డేమి సేసినను జెల్లును.

౪౮౨. సర్వమేకం జగన్నాథే.

"జగన్నాథక్షేత్రమునఁ గులభేదము లేదు" అను నర్థమున నిది ప్రయుక్తమై యున్నది. "జగన్నాథుని సేవయందుఁ గులభేదములే"దని యభిప్రాయము.

౪౮౩. సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్.

ఎల్ల శరీరమునకుఁ దల ముఖ్యము.

౪౮౪. సర్వః స్వార్థం సమీహతే.

ప్రతివాఁడును స్వార్థమును గోరును.

౪౮౫. సర్వపథీనాః కవయః.

కవు లన్ని మార్గములను ద్రొక్కినవారై యుందురు.

౪౮౬. సర్వే జనాః కాంచన మాశ్రయంతి.
ఎల్లరును ధనమును (ధనముగలవారిని) ఆశ్రయింతురు.

౪౮౭. సర్వే జనా స్సుఖినో భవంతు (స్పష్టము)

౪౮౮. సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్.
ఎల్ల యింద్రియములలోఁ గన్ను ప్రధానము.

౪౮౯. సర్వేషు దానే ష్వభయప్రధానమ్.
అన్ని దానములలో నభయప్రదానము ప్రధానము.

౪౯౦. సంశయాత్మా వినశ్యతి.
స్థిరమతిలేనివాఁడు చెడిపోవును.

౪౯౧. సంసర్గజా దోషగుణా భవంతి.
దోషములను గుణములును సహవాసమువలనఁ గలుగును.

౪౯౨. సస్త్రీకో ధర్మ మాచరేత్.
స్త్రీ సహితుఁడై ధర్మ మాచరింపవలయును.

౪౯౩. సహసా విదధీత న క్రియామ్.
ఏకార్యమునైనను దోఁచినవెంటనే చేయరాదు.

౪౯౪. సాగరం వర్జయిత్వా మహానదీ కుత్ర అవతరతి?
పెద్దనది సముద్రమును విడిచి యెక్కడ పడును?

౪౯౫. సారళ్యం సరళే కుర్యాత్, శఠే శాఠ్యం సమాచరేత్.
సరళస్వభావునివద్ద సారళ్యమును, శఠునివద్ద శాఠ్యమునుఁ జూపవలెను.

౪౯౬. సాహసే లక్ష్మీః. (స్పష్టము)

౪౯౭. సికతాకూపన్యాయము.
ఇసుకలోఁ దీసిన నూయి యొడ్లు విఱిగి పడిపోవును. బలిష్ఠములైన యు
లేని వాదమునకు దీనినిఁ బోల్తురు.

౪౯౮. సిద్ధమన్నం పరిత్యజ్య భిక్షా మటతి దుర్మతిః.
సిద్ధాన్నమును విడిచి యవివేకి భిక్ష మెత్తును,

"బొట్టుబెట్టి పిలిస్తే భోజనానికి పోక పెంకు పుచ్చుకొని పులుసుకు పోయింది" అని తెలుఁగుసామెత.

౪౯౯. సింహావలోకనన్యాయము. (స్పష్టము)

౫౦౦. సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్?

మంచి కవిత్వ మున్నచో రాజ్యమేల ?

౫౦౧. సుఖం హి దుఃఖా న్యనుభూయ శోభతే.

దుఃఖముల ననుభవించిన పిమ్మట కలిగిన సుఖము శోభిల్లును.

౫౦౨. సుందోపసుందన్యాయము.

సుందోపసుందులను రాక్షసులు తిలోత్తమ యను నచ్చరకై తమలోఁ దాము పోరాడుకొని యిరువురును మడిసిరి.

౫౦౩. సుపుత్రః సప్తమో రసః.

సత్పుత్రుఁ డేడవ రసము.

౫౦౪. సుప్తప్రబుద్ధన్యాయము.

నిద్రించి మేలుకొన్నవాఁడు పూర్వస్మృతిచేఁ బూర్వవిషయములను స్మరించిన విధమున యోగులు కల్పాంతమున మరణించియు మరల నుదయించి యదృష్ట విశేషముచేఁ బూర్వస్మృతినిఁ బొంది పూర్వాధీతములయిన వేదాదులను దిరిగి స్మరింతురు. వీరిని జాతిస్మరు లందురు.

౫౦౫. సూచీకటాహన్యాయము.

సూచి = సూది; కటాహము = పెద్దకాఁగు. సూది యల్పకాలములో ననాయాసముగాఁ జేయఁబడును. కటాహ మనల్పకాలమున నాయాసముచే సాధింపఁబడును. చిన్నపనియును బెద్దపనియును దటస్థపడినపుడు చిన్నదానిని ముందొనర్చి పిదపఁ బెద్దదానినిఁ జేయవలెనను నర్థమున నిది యుపయుక్తమగును.

౫౦౬. సేవా శ్వవృత్తిః.

సేవ కుక్కచేయు పనివంటిది.

౫౦౭. స్తనశల్య పరీక్షాన్యాయము.

స్త్రీయొక్క స్తనము లనుభవించి యానందింపఁ దగిన వేకాని అచ్చట నెన్ని యెముక లున్నవి? ఎంతెంత యున్నవి? అని పరీక్షింపఁదగినవి కావు. కావ్యమున రసాస్వాదము చేయక తప్పులెన్నువారికు దీనినిఁ బోల్తురు.

౫౦౮. స్త్రీతినామాపి మధురమ్.

“స్త్రీ”యను పేరుగూడ మధురము.

౫౦౯. స్త్రీణాం ప్రియాలోకఫలోహి వేషః.

స్త్రీలు తమవేషమును దమ ప్రియులు చూడవలెనని యభిలషింతురు.

౫౧౦. స్త్రీబుద్ధిః ప్రళయంకరీ (స్పష్టము).

౫౧౧. స్త్రీరత్నం దుష్కులాదపి.

దుష్కులమునుండియు స్త్రీరత్నమును గ్రహింపవచ్చును.

౫౧౨. స్థానస్థితః కాపురుషోఽపి సింహః.

తన యాశ్రయమున నున్న యల్పుఁడును సింహమే.

౫౧౩. స్థాలీపులాకన్యాయము.

“వండిన యన్నములో నొక మెతుకే పట్టిచూతురు”

౫౧౪. స్థితస్య గతి శ్చింతనీయా.

ఉన్నదానికి గతినిఁ గల్పింపవలయును.

౫౧౫. స్థూలారుంధతీన్యాయము.

సప్తర్షులలో వసిష్ఠునిభార్య యరుంధతి. సప్తర్షులును నాకాశమున నక్షత్రరూపమునఁ గలరు. అరుంధతియు వసిష్ఠునిదగ్గర నున్నది. అరుంధతీ నక్షత్రము మినుకుమినుకులాడుచుండును. కావున ముందు పెద్దనక్షత్రమగు వసిష్ఠ నక్షత్రమును జూపి పిమ్మటఁ దత్సమీపస్థమగు నరుంధతీతారను జూపుదురు. మొదట స్థూలమును జూపి పిమ్మట సూక్ష్మమును జూపుపట్ల నిది యుపయుక్తమగును.

౫౧౬. స్ఫటాటోపో భయంకరః

పాము పడగయొక్క యుద్ధతి భయంకరము. దీనినే “పటాటోపో భయంకరః” అనియు వ్యవహరింతురు.

౫౧౭. స్యాలకో గృహనాశాయ సర్వనాశాయ మాతులః.

బావమఱఁది గృహనాశనము సేయును. మేనమామ సర్వనాశనమును జేయును.

౫౧౮. స్రజమపి శిరస్యంధః క్షిప్తాం ధునో త్యహిశంకయా.

గ్రుడ్డివాఁడు మెడలో వేసిన పూలదండనుగూడఁ బామనిశంకించి త్రోసివేయును

౫౧౯. స్వకుచమర్దన న్యాయము.

ఆత్మశ్లాఘనమునకు దీనినిఁ బోల్తురు.

౫౨౦. స్వజాతి ర్దురతిక్రమా.

తనజాతి విడువ శక్యము గాదు.

౫౨౧. స్వతఏవ సతాం పరార్థతా.

సత్పురుషులకుఁ బరహితవృత్తి స్వభావసిద్ధము.

౫౨౨. స్వభావ మన్యథాకర్తుం క శ్శక్తో దైవనిర్మితమ్.

ఈశ్వరనిర్మితమగు స్వభావమును మార్ప నెవరికి శక్యమగును ?

౫౨౩. స్వభావసుందరం వస్తు న సంస్కార మపేక్షతే.

స్వభావముచే నందమైనవస్తువునకు సంస్కార మక్కఱలేదు.

౫౨౪. స్వభావో దురతిక్రమః.

స్వభావము దాఁటరానిది.

౫౨౫. స్వభావో మూర్ధ్ని వర్తతే.

అన్ని గుణములను మించి స్వభావము తలపై నుండును. అనఁగా నన్నిగుణముల కన్న స్వభావము మిన్న.

౫౨౬. స్వయం తీర్ణః పరాం స్తారయతి.

తా ను త్తీర్ణుఁడైనవాఁడు పరులను దరింపఁజేయును.

౫౨౭. స్వాంగుష్ఠమపి చుంబంతే మిక్షుదండ మయాచత.

తన వేళ్లు కుడుచుకొనుచున్నవానినిఁ జెఱకుముక్క నిమ్మని కోరెనఁట. "దిగంబరుని బట్టనిమ్మని యాచించినట్లు" అని యాంధ్రభాషీయము.

౫౨౮. స్వాభావికాత్ కృత్రిమ మన్యదేవ.

స్వాభావికము, స్వాభావికమే; కృత్రిమము, కృత్రిమమే.

౫౨౯. స్వామిభృత్య న్యాయము (స్పష్టము)

౫౩౦. హతః క్రతు రదక్షిణః.

దక్షిణలేని క్రతువు నాశమగును. అనఁగా ఫలహీనమగును. (క్రతువన సర్వవైదికకర్మలు నని యర్థము.)

౫౩౧. హసద్భిః క్రియతే కర్మ, రుదద్భి రనుభూయతే.

"నవ్వుతూ చేస్తారు. ఏడుస్తూ అనుభవిస్తారు" అని తెలుగు సామెత.

౫౩౨. హంసబకన్యాయము.

హంస హంసయే, బకము బకమే.

హంస శ్శ్వేతో బక శ్శ్వేతః కో భేదో బకహంసయోః,

నీరక్షీరవివక్షాయాం హంసో హంసో బకో బకః.

౫౩౩. హంసక్షీరన్యాయము.

పాలును నీరును గలిపి ముందుంచఁగా హంస నీటిని వదలి పాలుమాత్రమే త్రాగును.

౫౩౪. హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధి శ్శ్యామికాపి వా.

బంగారముయొక్క మంచిసెబ్బర లగ్నితప్తము గావించినపుడు తెలియును.

౫౩౫. హోతారమపి జుహ్వానం స్పృష్టో దహతి పావకః

అగ్ని తనయందు హోమము చేసి తనుపు వానినైనను ముట్టుకొన్నఁ గాల్చివేయును.

లౌకికన్యాయప్రకరణము సమాప్తము.

తత్సమచంద్రిక సమాప్తము.

# పరిశిష్టము

(౮౫ పుటలో 'తవ్యః— జేతవ్యము' ఇత్యాదికిఁ గ్రింద దీనినిఁ జేర్పవలెను.)

నిశ్చేతవ్యము; కాని "ప్రామాణికోఽయమితి చేతసి నిశ్చితవ్యః" అని శ్రీశంకరభగవత్పాదులవారు సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహమునఁ బ్రయోగించిరి.

(౭౩ పుటలో ౧౫౭ సూత్రోదాహరణముల క్రింద దీనినిఁ జేర్పవలయును.)

ఆ - దృ - యమాన = ఆద్రియమాణుఁడు. కాని "నిస్స్వః స్వస్థతయా సుఖేన వసతి హ్యాద్రియమాణోజనైః" అని ఆద్రియమాణ శబ్దమును శ్రీ శంకరాచార్యులవారు సర్వవేదాంత సిద్ధాంత సారసంగ్రహమున వాడిరి.

(౭౫ పుటలో 'ముద్ర—ముద్రాకరణము' అనుదానిక్రిందఁ జేర్పవలయును.)

ద్వితీయ - కృతము = ద్వితీయాకృతము (రెండవ చాలు దున్నిన)
తృతీయ - ,, = తృతీయా ,, (మూడవ ,, ,, )
శంబ - ,, = శంబా ,, (దిగదున్ని మెగదున్నిన)
బీజ - ,, = బీజా ,, (శూలముతో వండిన)

~~(ఖ) సంఖ్యాశబ్ద~~ మంతమందుఁగల సంఖ్యావాచక శబ్దమునకు 'కృ' ధాతు యోగమునఁ గర్షణార్థమున దీర్ఘము వచ్చును.

ద్విగుణ - కృతము = ద్విగుణాకృతము. (రెండుసారులు దున్నిన)
త్రిగుణ - ,, = త్రిగుణా ,, (మూఁడు ,, ,, )

ఈ యెల్ల యుదాహరణములందును కరణ, కృత, శబ్దములే చూపఁబడినను ఎల్ల 'కృ' ధాతు కృదంతరూపములు పరమైనను దీర్ఘము వచ్చునని యూహింపవలయును.

(౯౩ పుటలో (ఖ) వాక్యము చివరఁ జేర్పవలయును.)

'వ్రశ్చ'యొక్క రేఫమునకు 'ఋ'కారము వచ్చును.

(౧౦౨ పుటలో 'భుజ్ - (బుభుక్ష్)' ఇత్యాది పంక్తిక్రిందఁ జేర్పవలెను.)

ముచ్ - సన్ (ముముక్ష్) + ఉ = ముముక్షువు, మొ.

మోక్ష, మోక్షణపదములు మోక్షధాతు నిష్పన్నములు.

(౧౨౨ (ఘ) లో 'పరి'ని గూడ చేర్పవలెను. ఉదాహరణములలో 'పరిషత్' చేర్చవలయును.)

(౧౨౬ పుటలో 'ఘాత్యుఁడు' అను దానిక్రిందఁ జేర్పవలయును.)

'వబయోరభేదః' అను న్యాయముచే బంధ్యపదమే వంధ్యపదమైనది. వధ్యపదము బధ్యపదమైనది. ఇట్టియెడ నర్థభేదమును గానవచ్చుచున్నది. ఇది విచిత్రము. బధ్యపదము బంధధాతు నిష్పన్నముగాదు. కొందఱు పృషోదరాదిపాఠముచే బంధ్యపదము అనుస్వారలోపమును బొంది బధ్యపదమైనదనియుఁ జెప్పుదురు.

(౧౩౪ పుటలో ౨౩౨ సూత్రముక్రిందఁ జేర్చవలెను.)

(క) 'ని'కిఁ బరమైన 'సూద'యొక్క 'స'కారము షకార మగును.

ని - సూదనుఁడు = నిషూదనుఁడు.

(౧౩౫ పుటలో ౨౩౬ సూత్రోదాహరణములక్రిందఁ జేర్పవలెను.)

ఉద్భిద్ - జన్ - అ, ఉద్భిజ్జము (ఉద్భిత్ సన్ జాయతే) ఉద్భిద్భ్యో జాయతే అనియును గొందఱు విగ్రహింతురు.

(౧౪౧ పుటలో (ఘ) పిమ్మటఁ జేర్పవలయును.)

ఆప్టే నిఘంటువున 'వృధ'కుఁ బ్రేరణమున 'వర్ధయతి'వలె 'వర్ధాపయతి' యనియు రూప ముండునని "యది కోఽపి త్వాం మదయంతి కాలాభేన వర్ధాపయతి కిం తస్య పారితోషికం కరోమి" అను మాలతీ మాధవమునందలి వాక్యము నుదాహరించెను. అట్టియెడ నీ క్రిందివిధమునఁ గృదంతరూపము లుండును.

(ఛ) 'వృధ'కుఁ బ్రేరణమున అజాది యకారాది ప్రత్యయములు పరమగునేని 'వర్ధాప్' అనియు 'త' ప్రత్యయము దక్క మిగిలిన తకారాది సకారాది ప్రత్యయములు పరమగునేని 'వర్ధాపయ్' అనియు, 'త' ప్రత్యయము పరమగునేని 'వర్ధాపి'అనియు వికల్పముగా నాదేశములగును.

వృధ్ - వర్ధాపయితృ, వర్ధాపకుఁడు, వర్ధాప్యమానము, వర్ధాపితము, వర్ధాపనము మొ.

(జ) 'వర్ధాపక' శబ్దమునకు ఆ ప్తినిఘంటువున నీ క్రింది విధమున నర్థము వ్రాయఁబడియున్నది.

"వర్ధాపకం యదానందాదలంకారాదికం పునః
ఆకృష్య గృహ్యతే పూర్ణపాత్రం పూర్ణానకంచ తత్"
"హర్షాద్యుత్సవకాలే య దలంకారాంశుకాదికం
ఆకృష్య గృహ్యతే పూర్ణపాత్రం స్యాత్పూర్ణకంచ తత్"

అనఁగా వర్ధాపక, పూర్ణపాత్రి, పూర్ణానక, పూర్ణక శబ్దములు పర్యాయపదములు. సంతోషసమయమందు నమూల్యములైన వస్త్రాలంకారములలో నింపి పరిజను లహమహమికతో గ్రహింప నొసఁగిన పాత్రము వర్ధాపకాది నామములతో వ్యవహరింపబఁడునని యర్థము. వర్ధాపనశబ్దమునకు (కర్త్రర్థక 'అన'ప్రత్యయాంతము) 'జన్మదినోత్సవము' అను నర్థము వ్రాయఁబడినది. ఈ కాలమున నీ యర్థమున 'వర్ధంతీ' పదమును వాడుచున్నారు. (చూ, పుట. 303 చ)

(ఝ) వృధ్ - వర్ధయిత్రృ, వర్ధకుఁడు, వర్ధ్యమానము, వర్ధితము, వర్ధనము 'వృధ'కుఁ బ్రేరణార్థమునకుఁ 'గర్త్రర్థమున' 'అన' ప్రత్యయ మగును. వర్ధనుఁడు (వర్ధయతీతి)

"మర్దనం గుణవర్ధనం" మొ.

(౧౫౩ పుటలో 'ధూఫ్ - ధూపకుఁడు' ఇత్యాదిక్రిందఁ జేర్పవలెను)

ఉపస్తంభక మనవలెను. ఉపష్టంభకపద మసాధువు కాని కొందఱు పృషోదరాదిపాఠముచే సాధుత్వ మంగీకరింతురు.

౧౬౭ పుటలో 'కవనము' అను పదముక్రిందఁ జేర్పవలెను.

సేవనము (సేవ) సేవనము (రూ) సీవనము (సివ)

(౨౧౬ పుటలో "ఔపచారిక ప్రయోగము" అను దాని పిమ్మటఁ జేర్పవలయును.)

ఇట్లే బార్హద్రథుఁడు, శాకుంతలుఁడు మొదలగు 'అణ్' ప్రత్యయాంతరూపములు సిద్ధములు.

(౨౪౭ పుటలో 'స్త్రీలింగములుగానే యుండును' అను దానిపిమ్మటఁ జేర్పవలెను.)

అని యొకరు విగ్రహముఁ జూపిరి. కాని యిచ్చట చౌరపంచాశికా, ఉపదేశసాహస్రీ, అనుచోటులం దభేదోపచారమును జేయుటయే

మంచిది. 'చౌరపంచాశికా' అనునెడ వ్యధికరణ బహువ్రీహ్యభేదోపచారములు రెండును జెప్పుకొనవచ్చును. 'ఉపదేశసాహస్రీ' అనుచోట వ్యధికరణబహువ్రీహిని జెప్పరాదు. ఏలన నప్పుడు ౬౩౭ సూత్రముచే నిత్యముగా 'క' ప్రత్యయము రావలయును. కావున నభేదోపచారమే యుచితము.

౨౫౬ పుటలో ౩౯౩ సూత్రముయొక్క యుదాహరణములక్రిందఁ జేర్పవలెను.

(క) 'ఊరూ ప్రమాణ మస్య' అని యివ్విధమున విగ్రహవాక్యము.

(ఖ) పరిమాణవాచకములకును, బరిమాణాంతద్విగువునకును, ఈ ప్రత్యయములు రావు.

శమము (శమ పరిమాణముగలది)
విష్టి (విష్టి ,, )
వితస్తి (వితస్తి ,, )
ద్విశమము (ద్వౌ శమౌ ,, )

(గ) కొన్నియెడల స్వార్థమునందును 'మాత్ర' ప్రత్యయము వచ్చును. తావన్మాత్రము, చిన్మాత్రము.

(౩౨౨ పుటలో 'సమ్రాజః క్షిత్రి' అను దాని పిమ్మటఁ జేర్పవలెను.)

సమ్రాజ్ఞీ "శ్వశ్రువాం భవ" అను వైదికప్రయోగమునుబట్టి 'సమ్రాజ్ఞీ' అనియు భాషయం దుపయోగింపవచ్చును.

(౩౯౧ పుటలో 'ఉచ్చైర్గతముఖుఁడు' అను దానిక్రిందఁ జేర్పవలెను.)

(క) నిర్నిమిత్తము, నిర్నిరోధము, నిర్నిద్రము, మొదలగునెడల నిర్ణిమిత్తము, నిర్ణిరోధము, నిర్ణిద్రము అని ణత్వాదేశ మసాధువు.

పరిశిష్టము సమాప్తము.

# సాధుపత్రము

| పుట | అసాధువు | సాధువు |
|---|---|---|
| ౬ | ఋ + అ = ర | ఋ + అ = రా |
| ౭ | ఓకారాది | ఓకారాంత |
| ౯ | వీనికి స్పర్శములనియుఁ బేరు | ఈ పంచవర్గములకు స్పర్శములనియుఁ బేరు |
| ౨౬ | పార్ష్షి | పార్ష్ణి |
| ౨౮ | ప్రత్యయభావమును | ప్రత్యయమును |
| ౩౦ | డైప్ | డాప్ |
| ,, | దాయంతి | దాంతి |
| ౩౩ | ((క) 'దేవ' ఇత్యాది సూత్రమునకుఁ గ్రింద 'దేవచ్ఛాయము' అను నుదాహరణమును జేర్పవలయును) | |
| ,, | సానీయము | పానీయము |
| ౩౪ | ధుః(ధుఃచ్) | అధుః(అధుఃచ్) |
| ౩౫ | ఇకి | ఇ (కి) |
| ౩౯ | జేగీయ | జేగీయ్ |
| ,, | జయించుచున్న | గానము చేయుచున్న |
| ,, | జయింపఁబడుచున్న | గానము చేయఁబడుచున్న |
| ౪౮ | 'సి' ధాతువునకు | 'స్మి' ధాతువునకు |
| ,, | అవమాన | అమాన |
| ౭౪ | 'అ' ప్రత్యయము | 'అ' ప్రత్యయము |
| ౭౮ | ఇ, ఈ, కారాగమములు | అరి, అరీ ఆదేశములు |
| ౮౧ | జర్ | జార్ |
| ,, | (త్వా — తారయిత్వా... అనుపంక్తి 'ప్రేరణము' అనుశీర్షిక క్రింద నుండవలెను) | |
| ౮౪ | సేట్ ధాతువులు | (సేట్ ధాతువులు) |
| ౯౩ | వృశ్చ | వ్రశ్చ |
| ౯౮ | (అవ) | (రూ) |
| ౧౧౫ | గణేయరుచాంగణః (రూ) గణేయము | (రూ) గణేయము; (గణేయరుచాంగణః) |
| ౧౩౬ | ద్యతితము | ద్యుతితము |
| ౧౪౦ | (నిస్యందము) స్యందము | స్యందము (నిస్స్యందము) |
| ౧౪౨ | పరిణమమాణము | పరిణమమానము |

| | | |
|---|---|---|
| ౧౬౬ | సీవ్యమానము | సివ్యమానము (సివ) |
| ౧౬౭ | సీవితవ్యము | సేవితవ్యము (సివ) |
| ౧౬౯ | దృశి | దృశిర్ |
| ౧౭౧ | నధృ | నద్ధృ |
| ౧౮౩ | గ్రహీతృ | గ్రహీతృ |
| ౨౦౧ | రోమంథాయమాణము | రోమంథాయమానము |
| ౨౧౦ | ఇద | ఇత |
| ౨౧౯ | పారాశర్యుఁడు, పారాశర్యుఁడు | పారాశరుఁడు, పారాశర్యుఁడు |
| ౨౨౮ | పర్వతము, పార్వతీయము | పర్వతీయము, పార్వతము |
| ౨౨౯ | దేవకియము | దేవకీయము |
| ౨౫౬ | ఊరువులలోఁతు | ఊరువులలోఁతుగల |
| ౩౨౩ | ఫలాభ | ఫలాంభః |
| ౩౨౬ | ముటుడిగిన | ముట్లుడిగిన |
| ౩౬౭ | సకారాదేశము | సకారాగమము |
| ౩౮౯ | ('ఇత్యాది ప్రయోగములు' అను దానిని దీసివేయవలయును) | |
| ౩౭౧ | శృంగారవీరము | శృంగారవీరములు |
| ౩౯౬ | శోభదా | శోభనా |
| ౪౧౩ | దూర్వావము | దూర్వావనము |
| ౪౧౪ | వృత్ | 'వృత్' |
| ౪౨౮ | రాష్ట్రియుఁడు - రాష్ట్రియుఁడు | రాష్ట్రియుఁడు;రాష్ట్రీయుఁడు |
| ౪౩౩ | గాష | గాష్ఠ |
| ౪౫౮ | ప్రత్యుత్పన | ప్రత్యుత్పన్న |
| ౪౫౯ | సోమా | సోమ |
| ౪౬౨ | మనోరథానాం | మనోరథానా మ |